# చిగురులు - పువ్వులు

## (భావ గీతికలు)







రచన:
పి. దుర్గారావు, యం.ఓ.యల్.

రక్తాక్షినామ సంవత్సరము
శరదృతువు-ఆశ్వయుజము
అక్టోబరు-1984

సర్వస్వామ్యములు రచయితవి,

ప్రథమ ముద్రణము 500 ప్రతులు

మూల్యము : నాలుగు రూపాయలు

ముఖ చిత్రం :
శ్రీ పి. శ్రీనివాస శర్మ

ముద్రణము :
బాలాజీ ప్రింటర్సు,
విజయవాడ-4

ప్రతులకు :
**పి. దుర్గారావు,** యం ఓ.యల్
చెరుకుపల్లి పోస్టు
(వయా) నక్రేకల్,
నక్రేకల్ తాలూకా, నల్లగొండజిల్లా.

# వి న య వా క్య ము

'చిగురులు—పువ్వులు' అను ఈ చిన్ని పుస్తకము తెలుగు భాషామతల్లికి నిఱువదవ పూజా పుష్పముగా సమర్పించు కొనుచున్నాను.

అఖిలేశ్వరుడైన యా పరంజ్యోతిని నాశ్రయించాలనీ, సుందరమైన యీ ప్రకృతిలో లీనమవ్వాలనీ, సాటి జీవుల కష్టాలు, బాధలు తొలగించాలని, నూతన ప్రపంచం అవతరించాలనీ—అందఱి మనస్సులలో యీ మధుర భావాలు స్పందిస్తూ ఉంటాయి! ఆ విమల భావములే నా యీ భావగీతములకు మూలము.

పాడుకొనుటకు వీలుగా ఒకే ఒక ఛందస్సులో గుది గ్రుచ్చ బడినవి. అప్పుడప్పుడు వ్రాసికొనిన యీ పాటలు రసహృదయులను ఏమాత్రము స్పందింప జేసినను ధన్యునిగా భావించుకొందును.

చ యి త

# స మ ర్ప ణ ము

పుణ్యతీర్థములు, పునీతమైన క్షేత్రములు,
సుందరమైన కళలు, సురుచిరమైన శాస్త్ర విద్యలు,
ఉద్యాన వనాలు, అడవులు, కొండలు, నదులు, సెలయేళ్ళు;
సకల ప్రకృతి సంపదలకు నిలయమైన

**తెలుగు తల్లికి**

పుష్పాంజలులతో.



## ఆ బొమ్మతో

ఆ బొమ్మలో నేను యలరియుంటేనూ !
పెళ్ళికూతురు మల్లె ప్రేమ లొలికేనూ !

రంగు చీరను గట్టి చెంగులూ వ్రేలాడ
బొట్టు కాటుక దిద్ది పూల వాల్జడ తోడ
బుగ్గ చుక్కా తోడ పొలుపు సిగ్గులు పోదు !

ఆ బొమ్మలో నేను యలరి యుంటేనూ !
పెళ్ళికూతురు మల్లె ప్రేమ లొలికేనూ !

తలబ్రాలు పోసికొని తగ పెండ్లి కొమరుతో
బాజాల మ్రోతలను పల్లకీలో నెక్కి
ఊరంత దిరుగుదును ఉత్సవము విరియంగ !

ఆ బొమ్మలో నేను యలరి యుంటేనూ !
పెళ్ళికూతురు మల్లె ప్రేమ లొలికేనూ !

అత్తవారింటికీ అఱుగునప్పుడు నేను
అమ్మ కౌగిలి వదిలి యలరి నా స్వామితో
చిటికెనను నే బట్టి చెన్నుగా బోయెదను !

ఆ బొమ్మలో నేను యలరి యుంటేనూ !
పెళ్ళికూతురు మల్లె ప్రేమ లొలికేనూ !

పువ్వులు

## శ్రమజీవి మేనిపై

శ్రమజీవి మేనిపై విమల హర్షమునా !
స్వేద బిందువునుగా జెలగి మెఱయుదునా !

భూమాత తనువుపై పులకించి నాగటిని
ధరణిపై స్వేదమును తా నొలుకు కర్షకుడు
ఆ కర్షకుని నుదుట నలరుదున బిందువుగ !

శ్రమజీవి మేనిపై విమల హర్షమునా
స్వేద బిందువునుగా జెలగి మెఱయుదునా !

కండలను గఱిగించి మెండుగా శ్రమజేసి
వసుధలో సంపదల వనరులను సృజియించు
శ్రామికుని భుజముపై శ్రమ జలము నగుదునా ?

శ్రమజీవి మేనిపై విమల హర్షమునా !
స్వేద బిందువునుగా జెలగి మెఱయుదునా !

సామాన్య మానవుని శ్రమకు ప్రతిబింబమై
మేధావి మున్నుదురు మెఱయు జలకణమునై
నీతి న్యాయముల కిల నిజమగు ప్రతీకనై !

శ్రమజీవి మేనిపై విమల హర్షమునా !
స్వేద బిందువునుగా జెలగి మెఱయుదునా !

# గుడిలోని దీపమై

గుడిలోని దీపమై కూర్మి వెలుగులతో
స్వామి శ్రీ చరణముల సరస నుండగ కోర్కె !

విశ్వజను లందఱును విమలగీతిక బాడి
అర్ఘ్య పాదముల నిడు యర్చనల వేళలను
నా వెలుగు కాంతులను నలుదిశల ప్రసరింతు !

గుడిలోని దీపమై కూర్మి వెలుగులు చింది
స్వామి శ్రీ చరణముల సరస నుండగ కోర్కె !

అండకోట్లకు నెల్ల నాధార భూతమగు
శ్రీకాంతు చరణముల శిరము వంచెడి వేళ
నా స్నేహ గంధముల నలరింతు నాలయము !

గుడిలోని దీపమై కూర్మి వెలుగులు చింది
స్వామి శ్రీచరణముల సరస నుండగకోర్కె !

మనసు నిలకడ జేసి మధురమగు భక్తితో
పారవశ్యముతోడ పరమగీతము బాడి
ఆ స్వామి జ్యోతిలో నైక్యమొందగ కాంక్ష !

గుడిలోని దీపమై కూర్మివెలుగులు చింది
స్వామి శ్రీచరణముల సరస నుండగకోర్కె !

పువ్వులు

# తొలి మేఘములనుండి

తొలి మేఘములనుండి తొలి చినుకుగా జారి
భూమాత యొడియందు పులకరింపుదునా !

ఉఱుములో మెఱుపులో నొయ్యారముగ జారి
చల్లగా మెల్లగా జల్లుగా భువికేగి
భూమాత ముద్దిడగ పులకరింతును వేగ !

తొలిమేఘములనుండి తొలిచినుకుగా జారి
భూమాత యొడియందు పులకరింపుదునా !

చివురు పూవులతోడ చిత్రముగ నీ ధరణి
నవసస్యములతోడ నాట్యమాడగజేతు
నా త్యాగ ఫలముగని నాలోన హర్షింతు !

తొలి మేఘముల నుండి తొలి చినుకుగా జారి
భూమాత యొడియందు పులకరింపుదునా !

నా ప్రాణ జీవనము నర్పించెదను భువికి
పుడమి జీవులకెల్ల పూజ్య దేవత నగుదు
నేను లేనప్పుడును నను మఱచిపోరెవరు !

తొలి మేఘములనుండి తొలిచినుకుగా జారి
భూమాత యొడియందు పులకరింపుదునా !

# నేల బారాడు

నేల బారాడు నవ నెలవంక బాలనై
అమ్మ యొడిలో చిందులాడ నా కాంక్ష!

అమ్మ కౌగిలిజేరి యలరి ముద్దులుగొనుదు
నిండుగా బాల్దాగి, నీటుగా నిదురించి
తీయనీ లోకాల తీరుగా విహరింతు!

నేల బారాడు నవ నెలవంక బాలనై
తీయనీ లోకాల తీరుగా విహరింతు!

చిఱుగజ్జియలతోడ చిన్నారి పాదముల
నేల బ్రాకుచుబోయి నిలువుటద్దమునందు
నా పాప గన్గొనుచు నవ్వ సిగ్గులుపోదు!

నేల బారాడు నవ నెలవంక బాలనై
తీయనీ లోకాల తీరుగా విహరింతు!

చల్ల జేసెడివేళ మెల్లగా దరిజేరి
ముందు కాళ్ళను నిలిచి ముద్దుగా చేజాపి
'అమ్మ! వెన్నా!' యనుచు అదిరింతు! బెదిరింతు!

నేల బారాడు నవ నెలవంక బాలనై
తీయనీ లోకాల తీరుగా విహరింతు!

# తాతయ్య చేకాలు

తాతయ్య చేకాలు తడబడెడి వేళా!
నే నూత కఱ్ఱగా నిలువ మది కాంక్షా!

అంగములు సోలగను క్రుంగుచు కృశించుచును
బంధువులు దూరముగ పరగ నిలుచుండగను
నే నాత్మ బంధువుగ నిలువగా హృది వాంఛ!

తాతయ్య చేకాలు తడబడెడి వేళా!
నే నూత కఱ్ఱగా నిలువ మది కాంక్షా!

వయసు యౌవనమంత వ్రాలిపోవగ నంత
ప్రోవుచేసిన ధనము పోవగా చేజారి
దీనత్వ దశయందు దిక్కూచి నే నగుదు!

తాతయ్య చేకాలు తడబడెడి వేళా!
నేనూత కఱ్ఱగా నిలువ మది కాంక్షా!

స్వామి దీవన వోలె సరస నే నుండెదను
నిత్య సేవకునిగా నిలిచి సేవించెదను
అంత్య కాలము వఱకు నాదుకొన మదికాంక్ష!

తాతయ్య చేకాలు తడబడెడి వేళా!
నేనూత కఱ్ఱనై నిలువ మదికాంక్షా!

# పల్లకిని గూర్చున్న

పల్లకిని గూర్చున్న బంగారు బొమ్మకూ
బుగ్గపై చుక్కనై పోసగ నా కోర్కె!

అత్తవారింటికీ
అరుగు పెండిలి కూతు
నునుసిగ్గు బుగ్గపై నూగగా నా కోర్కె!

పల్లకిని గూర్చున్న బంగారు బొమ్మకూ
బుగ్గపై చుక్కనై పోసగ నా కోర్కె!

చందురుని పున్నమీ
అందాల మోముపై
కస్తురి సువాసనలు విస్తరింపగ కాంక్ష!

పల్లకిని గూర్చున్న బంగారు బొమ్మకూ
బుగ్గపై చుక్కనై పోసగ నా కోర్కె!

ఎన్నెన్నొ అందాలు
వన్నె చిందేడి మోము
దృష్టి దోషము బాపి తొణకగా నా కోర్కె!

పల్లకిని గూర్చున్న బంగారుబొమ్మకూ
బుగ్గపై చుక్కనై పోసగ నా కోర్కె!

# చల్లని నీటితో

చల్లనీ నీటితో చలివేంద్రమునను
మంటి కుండగ నుండి మధువు లొలుకుదునా!

దాహమున శోషిల్లి
దరిజేరు జీవులకు
కన్నతల్లిగ నేను కరుణ జూపుదునా!

చల్లనీ నీటితో చలివేంద్రమునను
మంటి కుండగ నుండి మధువు లొలుకుదునా!

చండ కిరణుడు తోణుకు.
నెండలకు భయపడెడి
గుండెలకు చల్లగా నండగా నిలుతునా!

చల్లనీ నీటితో చలివేంద్రమునను
మంటికుండగ నుండి మధువు లొలుకుదునా!

ఏ పుణ్య ఫలముతో
ఈ భూమి నుంటినో
ఆ భూమి ప్రజలకై ఆహుతిగ నగుదునా!

చల్లనీ నీటితో చలివేంద్రమునను
మంటికుండగ నుండి మధువు లొలుకుదునా!

# ఈ చందనపు బొమ్మ

ఈ చందనపు బొమ్మ కెంత భాగ్యమో!
పాప యొడిలో జేరి పవళించినదిగా!

తాను తల్లిని యనుచు తన బిడ్డ బొమ్మయను
ఆట పాటల నేర్పు నలరించు జోలలను
కూని రాగాలతో గుసగుసలు మాటాడు!

ఈ చందనపు బొమ్మ కెంత భాగ్యమో!
పాప ఒడిలో జేరి పవళించి నదిగా!

నిదుర మెలకువలలో నీడగా బొమ్ముండు
బొమ్మ తోడనె పాప పులకించు కికురించు!
బొమ్మ తేలును పాప పూర్ణ స్నేహములతో!

ఈ చందనపు బొమ్మ కెంత భాగ్యమో!
పాప యొడిలోజేరి పవళించినదిగా!

చీర రవికెలు తొడుగు సింగార మొనరించు
మల్లెపూవులు ముడుచు మగువ! నీ పెండ్లియను
చిన్ని కృష్ణునకంచు చేరి చెవిలో జెప్పు!

ఈ చందనపు బొమ్మ కెంత భాగ్యమో!
పాప యొడిలో జేరి పవళించినదిగా!

# తల్లి మనసున ప్రేమ

తల్లిమనసు ప్రేమ తరగలను గొలువా!
ఎవరి తరమౌను నీ భువి యందు జూడా!

శిశువు నోడిలో జేర్చి
చిరునగవు చిందుచును
మురిపెముల నొలకించు ముద్దులకు విలువెంత?

తల్లిమనసున ప్రేమ తరగలను గొలువా!
ఎవరి తరమౌను నీ భువియందు జూడా!

తప్ప టడుగులు నేర్పి
తన హృదికి హత్తుకొని
ముద్దుమాటలు నేర్పు ముత్యాల విలువెంత?

తల్లి మనసున ప్రేమ తరగలను గొలువా!
ఎవరి తరమౌను నీ భువియందు జూడా!

స్వామి దీవన వంటి
చల్లనీ చూపులకు
ఇలవేల్పు స్తన్యామిల విలువెంత? వెలయెంత?

తల్లిమనసున ప్రేమ తరగలను గొలువా!
ఎవరి తరమౌను నీ భువియందు జూడా!

## ఒళ్ళంత పూవులను

ఒళ్ళంత పూవులను నొప్పుగా దాల్చి!
వనలక్ష్మి నాదునా! వయ్యార మొలుకా!

మల్లెలను మొల్లలను
మంచి చామంతులను
తెలుగు తోటలలోని తెలుగుపూలు ధరించి!

ఒళ్ళంత పూవులను నొప్పుగా దాల్చి!
వనలక్ష్మి నాదునా వయ్యార మొలుకా!

చిలుక గోర్వంకలా
చిత్రమగు బాజాలు
మందపవనుడు నూదు మధురమగు సన్నాయి!

ఒళ్ళంత పూవులను నొప్పుగా దాల్చి!
వనలక్ష్మి నాదునా వయ్యార మొలుకా!

వనమాల చే దాల్చి
వలపంత చిందుచును
వరునిగా వాసంతు వరియింప నా కాంక్ష!

ఒళ్ళంత పూవులను నొప్పుగా దాల్చి!
వనలక్ష్మి నగుదునా వయ్యార మొలుకా!

# పదిమంది నోటిలో

పదిమంది నోటిలో పాటగా నేనై!
శ్రమజీవులకు కాంతి శాంతి గలిగింతునా!

వరిమళ్ళ కలుపుల్లను వయ్యార మొలికించి
కలకంఠ నాదమున కమ్మగా పాడేటి
మాల పిల్లల నోట మధువుగా నొలుకుదున?

పదిమంది నోటిలో పాటగా నేనై!
శ్రమ జీవులకు కాంతి శాంతి గలిగింతునా!

'పొలిపొలిగ' యనుచునూ పొలము నూడ్చెడివేళ
'రార పొలిగా!' యనెడి రాగమున నే మారి
జీతగాళ్ళకు నేను చేయూత నిత్తునా!

పదిమంది నోటిలో పాటగా నేనై!
శ్రమ జీవులకు కాంతి శాంతి కలిగింతునా!

హరియించి శోకమును హర్షమును గలిగించి
నిత్య జీవితములో నెలవంకగా మారి
అలసి సొలసిన వారి యాశగా నిలుతునా!

పదిమంది నోటిలో పాటగా నేనై!
శ్రమ జీవులకు కాంతి శాంతి గలిగింతునా!

## కవి కుమారుండనై

కవి కుమారుండనై కవిత లల్లుదునా!
కవిత విని క్రాంతిపథ కాములై నడువా!

నవ్య పదములతోడి నవ గీతముల నల్లి
శాంత్యభ్యుదయములను సాధించుడని బాడి
నవ ప్రభాతమునకై నాంది నే నగుదునా?

కవికుమారుండనై కవిత లల్లుదునా!
కవిత విని క్రాంతిపథకాములై నడువా!

హెచ్చు తగ్గులు లేని ఉచ్చ నీచము లేని
శాంతి జీవనమునకు స్నేహగీతిని వ్రాసి
విమల జీవితమునకు వేణువై పాడుదున?

కవికుమారుండనై కవిత లల్లుదునా!
కవిత విని క్రాంతిపథకాములై నడువా!

మార్గమేదో దెలిపి మర్మమును వివరించి
మనిషి దేవతవోలె మారవలెనని బాడి
ఆశలను సాధింప నాహుతిగ నౌదునా?

కవికుమారుండనై కవిత లల్లుదునా!
కవిత విని క్రాంతిపథ కాములై నడువా!

# పుష్ప వాటిక

పుష్పవాటికయందు పూమొక్క నేనై!
పూల వాసనలతో పులకింతు భువినీ!

మలయ పవనునికి నా మధురిమలు గలిగించి
ప్రకృతి సొగసులకు నే పరమ శోభను గూర్చి!
మాతృ పూజకు నేను మాల నర్పింతునా!

పుష్పవాటికయందు పూమొక్క నేనై!
పూల వాసనలతో పులకింతు భువినీ!

ప్రణయమూర్తుల మధ్య చనువుగా నే జేరి
నే సాక్షినని పలికి నిండు ప్రేమలు తొలుక!
తనరు నా పూవులను తలంబ్రాలు పోయుదున?

పుష్పవాటికయందు పూమొక్క నేనై!
పూల వాసనలతో పులకింతు భువినీ!

నవభక్తి మార్గముల విరియు నా కుసుమముల
వైజయంతిని గూడి యొప్పగులుకుదునా?
ఆనంద హృదయమున యలరుదున మాలగా?

పుష్పవాటికయందు పూమొక్క నేనై!
పూలవాసనలతో పులకింతు భువినీ!

# బాల సూర్యుని

బాలసూర్యుని లేత బంగారు కిరణమై
విశ్వమంతా కాంతి విరియ నా కాంక్షా!

చీకటుల తెరలనూ
శిథిలపరుపగ విరిసి
తొలిసంజ కెంపునై తొణక నా కోర్కె!

బాలసూర్యుని లేతబంగారు కిరణమై
విశ్వమంతా కాంతి విరియ నా కాంక్షా!

అఖిల జీవులకు నే
నమృతంపు సోననై!
అరుణోదయపు రేఖ నలర నా కోర్కె!

బాలసూర్యుని లేత బంగారు కిరణమై
విశ్వమంతా కాంతి విరియ నా కాంక్షా!

జీవమై, ప్రాణమై
దివ్యాను భూతులను
మానవుని మనసులో మణిగిపో నా కోర్కె!

బాలసూర్యుని లేతబంగారు కిరణమై
విశ్వమంతా కాంతి విరియ నాకాంక్షా!

## కడలిలో తరగనై

కడలిలో తరగనై కదలాడి హర్షమున
పుడమితల్లిని జేరి పులకరించుదునా?

ఉవ్వెత్తునను లేచి యురకలను వేయుచు
పాల నుర్వులతోడ ప్రభలు చిందుచు పర్వి
భూమాత యంకమున బొలుపుగా జేరెదను!

కడలిలో తరగనై కదలాడి హర్షమున
పుడమి తల్లిని జేరి పులంరించుదునా!

బాలసూర్యుని స్వర్ణ ప్రభలు నే తలదాల్చి
పూర్ణచంద్రుని రజిత-పూలవన్నెలు తోణికి
రాజనర్తకి వోలె రమ్య సొగసులు పోదు!

కడలిలో తరగనై కదలాడి హర్షమున
పుడమతల్లిని జేరి పులకరించుదునా!

హా! స్వామి! యనుచు నే నహరహాము హోరెత్తి
దీర్ఘ వేదనలతో దివ్యమూర్తినిఁ బొగడి
ఆకాశమును జూచి యంతమై పోదునా!

కడలిలో తరగనై కదలాడి హర్షమున
పుడతమితల్లిని జేరి పులకరించుదునా!

# చిమ్మ చీకటియందు

-చిమ్మ చీకటియందు చింతించు జనులకు
-కాంతి రేఖగ మారి గమ్యమును జేర్తునా?

దారి తెలియక కుమిలి దశదిశలు చెదిరినా
మానవాళికి నూత్న మధుర మార్గము దెలిపి
ఐక్యమగునటు జేసి యాశ గొలుపుదునా?

-చిమ్మ చీకటియందు చింతించు జనులకు
-కాంతి రేఖగ మారి గమ్యమును జేర్తునా?

దాసత్వమును ద్రోసి దారిద్ర్యమును మాపి
శ్రీలతో విలసిల్లు స్వేచ్ఛా ప్రపంచమున
నవ్య జీవనమునకు నాంది బలుకుదునా?

-చిమ్మ చీకటియందు చింతించు జనులకు
కాంతి రేఖగ మారి గమ్యమును జేర్తునా!

కాసింత దీపమై కాగడాగా వెలిగి
పుడమినంతను విమల పూర్ణిమా కాంతులను
మాధుర్యములు చింది మటుమాయ మగుదునా!

-చిమ్మ చీకటియందు చింతించు జనులకు
కాంతి రేఖగ మారి గమ్యమును జేర్తునా?

## మలయ వీచికనుగా

మలయ వీచికనుగా మర్మర ధ్వానులతో
మాధుర్య మొలికింప మనసులో కాంక్షా!

చిన్నారి చిగురునకు జీవనము నందించి
ఆకు జొంపములను ఆటలను దేలించి
పుష్ప గుచ్ఛములను పులకలను ముంచెదను!

మలయ వీచికనుగా మర్మర ధ్వానులతో
మాధుర్య మొలికింప మనసులో కాంక్షా!

ఉదయ సంధ్యలకు నే నోంకార శంఖమై
బాలసూర్యునకు నే పట్టెదను హారతిని!
కవికుమారునకు నే కావ్య లందించెదను!

మలయ వీచికనుగా మర్మర ధ్వానులతో
మాధుర్య మొలికింప మనసులో కాంక్షా!

సెలయేటి ధారలను చల్లదనము భరించి
పుష్పవాటికలోని పూవాసనలు దాల్చి
అఖిల జీవులకు నే నానంద మొసగింతు!

మలయ వీచికనుగా మర్మర ధ్వానులతో
మాధుర్య మొలికింప మనసులో కాంక్షా!

## నెలవంకనై

నెలవంకనై నేను నిలిచియుంటేనూ!
అఖిల విశ్వమునకును అంద మొప్పేనూ!

మలిసంధ్య రేఖలను మధురముగ తోంచుకుచును
బంగారు తీగనై భాగ్యరేఖగ నుండి
విశ్వ జనులందఱికి విమల శుభములు కూర్తు!

నెలవంకనై నేను నిలిచి యుంటేనూ!
అఖిల విశ్వమునకును అందమొప్పేనూ!

చిన్న చుక్కలమధ్య చిత్రముగ నే నిలువ
అఖిల జనులందఱును నాహ్లాదమును జెంది
నూలుపోగుల నిచ్చి నుతులు చేయుదురు నను!

నెలవంకనై నేను నిలిచియుంటేనూ!
అఖిల విశ్వమునకును అంధమొప్పేనూ!

సకల సస్యములు ధర సత్వరము పెంపొంద
తీయనీ వెన్నెలలు తీరుగా నందింతు!
ననుజూచి ప్రేమికులు నాట్యముల నాడుదురు!

నెలవంకనై నేను నిలిచియుంటేనూ!
అఖిల విశ్వమునకును అందమొప్పేనూ!

## లేత పచ్చికనుగా

లేతపచ్చికనుగా లీల మెఱయుదునా!
భూమాత వలువనై పొలుపు చిందుదునా!

ఆకుపచ్చదనాలు అందాలు జిందుచును
పుడమితల్లికి గూర్తు పులకించు చందాలు!
ఆలమందలకు నే నాహ్లాద మొనరింతు!

లేతపచ్చికనుగా లీల మెఱయుదునా!
భూమాత వలువనై పొలుపు చిందుదునా?

నా లేత పచ్చికల నవ్య హిమబిందువులు
బాలసూర్యుని ప్రభలు పైనిబడి మెఱయగా
ముత్యాల పంటవలె ముద్దులొలుకుదునా?

లేతపచ్చికనుగా లీల మెఱయుదునా!
భూమాత వలువనై పొలుపు చిందుదునా!

నింగిచుక్కలను నే నీటుగా బరికింతు
గిరిశిఖరముల జూచు కిన్నెరల గాంచుదును!
దిక్కులను బరికింతు దిశల నుపాసింతు!

లేతపచ్చికనుగా లీల మెఱయుదునా?
భూమాత వలువనై పొలుపు చుందునా?

## మల్లెపూవుగ

మల్లెపూవుగ విరిసి మధువు లొలుకుదునా!
మధురప్రేమకు మధ్య మమతనై నిలుతూ!

తొలిప్రేమ దంపతుల తొలికించి వాసనలు
మధురాను భూతులను మనసులను నటికించి
చిరకాల స్నేహముల చెన్నుగా సమకూర్తు!

మల్లెపూవుగ విరిసి మధువు లొలుకుదునా!
మధురప్రేమకు మధ్య మమతనై నిలుతునా!

విరహ జనులకు నేను వింత నేస్తాన్నినై
గతకాల స్మృతులన్ని కనులముందుకు దెత్తు!
విరహగీతముల నే వినుచుందు శాంతముగ!

మల్లెపూవుగ విరిసి మధువు లొలుకుదునా!
మధురప్రేమకు మధ్య మమతనై నిలుతూ!

క్రొత్త దంపతులకు కోర్కెలన్నియు దీర్తు
తీరగా ప్రేమలను చిత్రముగ ప్రాకింతు!
వలపుపంటకు నేను వరమిచ్చు దైవమై!

మల్లెపూవుగ మారి మధువు లొలుకుదునా!
మధురప్రేమకు మధ్య మమతనై నిలుతూ!

# ఇంద్ర ధనుసు

ఇంద్రధనుసుగ మారి యింపు గులుకుదునా!
ఏడురంగులు చింది వేడ్క చేయుదునా!

భువికి దివికీ మధ్య పూలమాలగ మారి
స్వర్గధామమునకూ తోరణము గట్టెదను!
మబ్బుకన్నెలను నే మాధుర్యమున దేల్తు!

ఇంద్రధనుసుగ మారి యింపు గులుకుదునా!
ఏడురంగులు చింది వేడ్క చేయుదునా!

పికిలి పిట్టలను నే ప్రేమతో లాలింతు!
రాజహంసలకు నే రమ్యకాంతుల నిత్తు
జెగ్గురుల బంతులను ప్రేమతో పులకింతు!

ఇంధ్రనుసుగ మారి యింపు గులుకుదునా!
ఏడురంగులు చింది వేడ్క చేయుదునా!

క్రొత్త జీవితమునకు కోరికల నూరింతు
క్రొత్త రూపకమునకు గూర్తు నవనాయకుల
క్రొత్త దనమున జగతి కూడి హర్షమునొంద!

ఇంద్రధనుసుగ మారి యింపు గులుకుదునా!
ఏడురంగులు చింది వేడ్క చేయుదునా!

# గున్న మామిడిపైని

గున్నమామిడిపైని కోకిలను నేనై
కుహూకుహూ రవములను గూర్చి పాడుదునా!

అఖిల ప్రపంచ మిల ఆనందమున దేల
తీయని మాటలను తీరుగా నేబాడి
కొండకోనలను నే కోటి ధ్వనులను నేతు!

గున్నమామిడిపైని కోకిలను నేనై!
కుహూకుహూ రవములను గూర్చి పాడుదునా!

సెలయేటి జాలులను చిఱుచేప లెగురగా
ఆకువచ్చని బీళ్ళ నాడగా జింక లటు
తూలిపూవుల పైని తుమ్మెదలు నర్తింప!

గున్నమామిడిపైని కోకిలను నేనై!
కుహూకుహూ రవములను గూర్చి పాడుదునా!

ప్రేమికుల మధ్య నే ప్రేమగీతమునునై
బాటసారికి నాటి పాటనై, మాటనై
వేదనలు మాపేటి వీణవలె పాడుదును!

గున్నమామిడినిపైని కోకిలను నేనై!
కుహూకుహూ రవములను గూర్చి పాడుదునా!

## పూవు పూవున

పూవు పూవున ద్రవాలి పులకరించుదునా!
తుమ్మెదగ నే బాడి తూలియాడుదునా!

> పుష్పాదుల రేపుతూ, పూసోనలను ద్రావి
> మందార మకరంద మాధుర్యముల దేలి
> నాట్యగీతములతో నవ్యతల నోలికింతు !

పూవుపూవున ద్రవాలి పులకరించుదునా !
తుమ్మెదగ నే బాడి తూలియాడుదునా !

> ఉదయ గీతములతో నుత్సాహ మొనరించి
> మేలుకొలుపులు పాడి వెలయింతు జాగృతిని!
> సకల జీవులకు నే సంతోష మొనరింతు !

పూవు పూవున ద్రవాలి పులకరించుదునా !
తుమ్మెదగ నే బాడి తూలియాడుదునా !

> సరిక్రొత్త యుగమునకు, శాంతి సందేశమును
> సరిక్రొత్త భావముల స్పందింప మానవులు
> సరిక్రొత్త జీవనము విరియింతు యీజగతి !

పూవుపూవున ద్రవాలి పులకరించుదునా !
తుమ్మెదగ నే బాడి తూలియాడుదునా !

# అందాల నింగి

అందాల నింగిలో ఆషాఢమేఘమై
అఖిల జగతికి నేను ఆనంద మొనరింతు !

ఉఱుములను మెఱుపులను నొయ్యార మొలికించి
పెనుగాలులను వీచి ప్రళయమును సృజియింతు !
అమృత ధారలతోడ హర్షమును గలిగింతు !

అందాలనింగిలో ఆషాఢమేఘమై
అఖిలజగతికి నేను ఆనంద మొనరింతు !

అఖిల సస్యములకును, నాధార భూతమై
పుడమి తల్లికి గూర్తు పూర్ణ యౌవనమును
ప్రకృతిమాతకు నిత్తు పగడాలు ! ముత్యాలు !

అందాలనింగిలో ఆషాఢమేఘమై
అఖిలజగతికి నేను ఆనంద మొనరింతు !

బంగారు జల్లులను భాగ్యముల నొలికింతు
పుడమి జనులకు నేను పూర్ణాభ్యుదయమునై
పశుపక్షులకు నేను బాధల నివారింతు !

అందాల నింగిలో ఆషాఢ మేఘమై
అఖిల జగతికి నేను ఆనంద మొనరింతు !

# సెలయేటి జాలునై

సెలయేటి జాలునై శిలలనుండీ జారి
వెలలేని యందాలు గలిగింతునా !

కొండ కోనలనుండి బండలను దాకుచును
ముందు వెనుకల దూలి ముత్యాల దడంలా !
క్రిందపడి ఝల్లునని కిలకిలా నవ్వుదును !

సెలయేటి జాలునై శిలలనుండీ జారి
వెలలేని అందాలు గలిగింతునా !

దారి తెన్నూ లేని ఝుడివాన ధారలుగ
భూమితల్లినిజేరి పులకింతు కేరింతు !
సన్నని కిన్నెరా మీటినా పాటగా !

సెలయేటి జాలునై శిలలనుండీ జారి
వెలలేని యందాలు గలిగింతునా !

అడవులను ప్రవహించి య్యందాల నొలికింతు
పశుపక్షులకు నేను పరమాప్తురాలినై
చిత్రకారునికి నే చిరకాల శిల్పమై !

సెలయేటి జాలునై శిలలనుండీ జారి
వెలలేని యందాలు గలిగింతునా !

## కొలనిలో కలువ

కొలనులో కలువనై కులుకు లొలుకుదునా!
వెలలేని యందాలు వొలకబోయుదునా!

ఎఱుపు తెలుపూ నలుపు ఎన్నో సొగసులుబోదు
కనువిందు గూర్చుదును కమలముల జతగూడి!
అందాల బాలనై యలరి సిగ్గులుపోదు!

కొలనిలో కలువనై కులుకు లొలుకుదునా!
వెలలేని యందాలు వొలకబోయుదునా!

అందాల జాబిల్లి యలరి కరములుజాప
నునుసిగ్గు పొడుములు నూగిసలు నను ముంప
తామరల చాటునకు తరలుదును తడబడుచు!

కొలనిలో కలువనై కులుకు లొలుకుదునా!
వెలలేని యందాలు వొలకబోయుదునా!

సృష్టిలో అందాలు చిత్రాలు గలవెన్నో
కలువభామల వన్నె విలువెంచ తరమా!
బంగారు శిల్పములు! భవభూతి కవిత లవి!

కొలనిలో కలువనై కులుకు లొలుకుదునా!
వెలలేని యందాలు వొలకబోయుదునా!

## వెలుగు సంధ్యలు

వెలుగు సంధ్యల వోలె విమల హర్షమునా
అందాలు చిందుదును అమల కాంతులనూ !

పికిలిపిట్టలసొగసు ప్రీతి పలుకులు విందు
వాన కోయిల పలుకు వార్తలను నే విందు
బెగ్గురుల పంక్తులను ప్రేమతో దిలకింతు !

వెలుగు సంధ్యల వోలె విమల హర్షమునా
అందాలు చిందుదును అమల కాంతులనూ !

ఉదయాద్రి నుదయించు ఉత్సాహ కాంతులను
రంగు రంగుల వెలుగు అందాల దీపాల
ఆకాశ మంతటను నలుముకొందును వేగ !

వెలుగు సంధ్యల వోలె విమల హర్షమునా
అందాలు చిందుదును అమల కాంతులనూ !

వేగుచుక్క ముందు వేడ్కతో పయనింప
బాలసూర్యుడు వెనుక పయనమై రాగా
భువినంత రంగులను పులకింపగా జేతు !

వెలుగు సంధ్యలవోలె విమల హర్షమునా!
అందాలు చిందుదును అమల కాంతులనూ !

# కొండ కొమ్మగ

కొండకొమ్మగ నేను కొలువు దీరుదునా!
అందమగు నాకాశమందు తేలుదునా?

సుందర ప్రభాతములను, సూర్యాస్తమయములను
ఆకుపచ్చని చేలు, అందాల సెలయేళ్ళు
కనులారగాంచి నే కలకలా నవ్వుదును!

కొండకొమ్మగ నేను కొలువు దీరుదునా!
అందమగు నాకాశమందు తేలుదునా!

చుక్కలెన్నో వచ్చి చుట్టుచేరును నన్ను
అందాల జాబిల్లి యాడుకొనుటకు వచ్చు
అప్సరల నాట్యాలు, అందాలు నే జూతు!

కొండకొమ్మగ నేను కొలువు దీరుదునా!
అందమగు నాకాశమందు తేలుదునా!

సర్వ ప్రాణులు నాకు సహజ బంధువులునై
విశ్వమంతయు నాకు విమలమగు గృహమగును!
తలనెత్తి ధీరునిగ ధరణిలో నిలిచెదను!

కొండకొమ్మగ నేను కొలువు దీరుదునా!
అందమగు నాకాశమందు తేలుదునా!

## అలలపై తెరలపై

అలలపై తెరలపై అందాల పడవనై
అలరింతునా పుడమి పులకింతునా !

అవతలొడ్డున నున్న అందాల రాణినీ
ఇవతలొడ్డున నున్న యీ రాజకొమరునీ !
ఒకచోట జేర్చి నే నొయ్యార మొలుకుదున ?

అలలపై తెరలపై అందాల పడవనై
అలరింతునా పుడమి పులకింతునా !

ప్రేమ గీతాలతో ప్రీతి సంగతులతో
మనసులోపలి వలపు మాధుర్యముల నొలుకు
ప్రేమికుల మధ్య నే ప్రీతి చుట్టము నగుదు !

అలలపై తెరలపై అందాల పడవనై
అలరింతునా పుడమి పులకింతునా !

చుక్కాని నయ్యేదను సుడు లధిగమించెదను
విసురు గాలుల నిలిచి వేగ తెరచాప ఎత్తి
గమ్యమును జేరెదను గడచి యడ్డంకులను !

అలలపై తెరలపై అందాల పడవనై
అలరింతునా పుడమి పులకింతునా !

# భూమి యాకాశములు

భూమి యాకాశములు పొసగి కలిసినచోట
బాటసారిగ నేను పయనమై పోదునా ?

నింగి నీలాకాశ నీడ భువి వ్రాలగా
పుడమి తల్లీ మోము ముద్దులాడెడిచోటు !
ఆ చిత్రమును జూడ నలరి నే పయనింతు !

భూమి యాకాశములు పొసగి కలిసినచోటు
బాటసారిగ నేను పయనమై పోదునా ?

కొండ కోనలు గడిచి కోటి నదులను దాటి
కాఱడవులను దాటి కఠినశిలల గమించి
ఆ చిత్రమును జూడ నరుగుదును నొంటిగా !

భూమి యాకాశములు పొసగి కలిసినచోటు
బాటసారిగ నేను పయనమై పోదునా !

వెనుకంజ వేయ నే వెన్ను జూపను ! నిజము !
ముందుకే జనుచుందు మూలమును గనుగొనగ !
పాదయాత్రను జేసి పయనమై పోవుదును !

భూమి యాకాశములు పొసగి కలిసిన చోటు !
బాటసారిగ నేను పయనమై పోదునా !

# కడలిలో తరగనై

కడలిలో తరగనై కదిలి యాడుదునా !
పుడమి తల్లిని జేరి పులకరించుదునా!

రాగి యాకుకువోలె రవరవలు చేయుచును
కడలిలో నే బుట్టి కదలుచు తరంగముగ
భూమాత యంకమున పూర్ణమగు నా తనువు !

కడలిలో తరగనై కదిలి యాడుదునా !
పుడమి తల్లినిజేరి పులకరించుదునా !

సూర్యబింబము నుండి సుందర సుకాంతులను
అలలు రా మును వెనుక నాట పాటలతోడ
పుడమి తల్లొడియందు పులకింతు నిదురింతు !

కడలిలో తరగనై కదిలి యాడుదునా !
పుడమి తల్లినిజేరి పులకరించుదునా !

తపియించు టే జన్మ తాత్పర్య మది యేమొ !
సుఖియించు టే జన్మ శూన్యత్వ మేమో !
విలపింతు నా జన్మ విమలత్వమును బొంద !

కడలలో తరగనై కదిలి యాడుదునా !
పుడమి తల్లినిజేరి పులకరించుదునా !

# క్రొత్త లోకమ్మునకు

క్రొత్త లోకమ్మునకు క్రొత్త జీవితమునకు
తొలికోడి కూతనై పలుక నా కోర్కె!

మనుజులందఱు నూత్న
మధురాను భూతులను
స్నేహ వారాసిలో చెలగ నా కాంక్ష!

క్రొత్త లోకమ్మునకు క్రొత్త జీవితమునకు
తొలికోడి కూతనై పలుక నా కోర్కె!

విశ్వ జనులందఱును
విమలమగు హృదయముల
ఆనంద జగతిలో నలర నా కోర్కె!

క్రొత్త లోకమ్మునకు క్రొత్త జీవితమునకు
తొలికోడి కూతనై పలుక నా కోర్కె!

వివిధ సంస్కృతులతో
విలసిల్లి జగమంత
మింటి చుక్కల వోలె మెలగ నా కాంక్ష!

క్రొత్త లోకమ్మునకు క్రొత్త జీవితమునకు
తొలికోడి కూతనై పలుక నా కోర్కె!

## హేమంతమున

హేమంతమున జూతు హిమబిందువై నేను
విశ్వమంతా నాదు విమల ప్రతిబింబమున !

నింగి నీలాకాశ నిండు చందురు జూతు
అందాల చుక్కలను నఖిల గిరివనములను
నాలోనె నే జూతు నవ సంధ్యా రేఖలను !

హేమంతమున జూతు హిమబిందువై ! నేను
విశ్వమంతా నాదు విమల ప్రతిబింబమున !

చిగురుటాకుల నుండి మొగలి రేకులనుండి
గరికపూవుల నుండి ఘన వృక్షముల నుండి
ఒక్కొక్క చుక్కనై నొలుకుదును ధరణిపై !

హేమంతమున జూతు హిమబిందువై నేను
విశ్వమంతా నాదు విమల ప్రతిబింబమున !

బాల సూర్యుని ప్రభలు పై కొనగ మేనిపై
ముత్యాల దండవలె రత్నాల రాశివలె
పుడమి తల్లిని నేను పులకింతు హారమై !

హేమంతమున జూతు హిమబిందువై నేను
విశ్వమంతా నాదు విమల ప్రతిబింబమున !

అందాలు చందాలు చిందింపనా—నేను
పొందుగా అప్సరస యందైన మ్రోగీ !

గిరిశిఖరముల యందు వరగోపురములందు
ఉద్యాన వనములను నొయ్యార మొలికించి
అందాలు చిందగా నర్తింపనా !
చందాలు విరియగా వర్తింపనా !

అందాలు చందాలు చిందింపనా—నేను
పొందుగా అప్సరస అందైన మ్రోగీ!

శిలలు శిల్పాలైన చిత్రమగు గుహలందు
చిత్ర లేఖన కళలు సిరులు గురిసిన చోట
ఘల్లు ఘల్లున రవళి గలిగింపనా !
ఝల్లు ఝల్లున మేను పులకింపనా !

అందాలు చందాలు చిందింపనా—నేను
పొందుగా అప్సరస అందైన మ్రోగీ !

శాస్త్ర విద్యలు తెలియు సఖులందు ప్రియులందు
నవ రసాత్మకములగు నాట్య వేదిక లందు
శృంగార భావములు తొలికింపనా !
బంగారు తీగెలను బంధింపనా !

అందాలు చందాలు చిందింపనా—నేను
పొందుగా అప్సరస అందైన మ్రోగీ !

# కావ్య గీతం

కవి కుమారుని మధుర కావ్యగీతమునై
కలకాల మీ భువిని కలలు రేపుదునా !

దివికి భువికీ వలపు తీయనీ నిచ్చెనల
ఆకాశ పుష్పమును నందుకొన పై కేగి
అప్సరతో పేరు డాడుకొను కావ్యమున !

కవి కుమారుని మధుర కావ్య గీతమునై
కలకాల మీ భువిని కలలు రేపుదునా !

దుష్ట రాక్షసులను- దునుమాడి ఖడ్గమున
కష్టముల బాపి తన ఘన మాతృ దేశమును
రక్షించు వీరవరు రమణీయ కావ్యమున!

కవి కుమారుని మధుర కావ్య గీతమునై
కలకాల మీ భువిని కలలు రేపుదునా !

మాతృ ఋణమును దీర్చి మర్యాద నిలుపగా
పుడమి ప్రజలాశలను పూరించు వ్యక్తినై
సమరమును నడిపినా సాహసుని చరితమున

కవి కుమారుని మధుర కావ్యగీతమునై
కలకాల మీ భువిని కలలు రేపుదునా !

# విశ్వ వీణ

విశ్వవీణకు నేను తంత్రినై మ్రోగి!
విమల స్నేహము ధరణి విరియపాడుదునా!

మతభేదమును మాపి-మాపి కులభేదమును
రంగుభేదములనూ రవరవలు శమయించు
మానవత్వము దెలుపు మధురగీతము నగుదు!

విశ్వవీణకు నేను తంత్రినై మ్రోగి!
విమలస్నేహము ధరణి విరియ పాడుదునా!

హెచ్చు తగ్గులు బాపి హితవు మేలొనరించు
సమసమాజము ధరణి స్థాపింపుడని పలుకు
క్రొత్తగీతికి నేను క్రొత్త పల్లవి నౌదు!

విశ్వవీణకు నేను తంత్రినై మ్రోగి!
విమలస్నేహము ధరణి విరియపాడుదునా!

రారండి! రండనీ! లేలెండు లెండనీ!
నవజాగృతికి నేను నవపతాకమునునై
నవ ప్రభాతమునకూ నవసంధ్య రేఖగా!

విశ్వవీణకు నేను తంత్రినై మ్రోగి
విమల స్నేహము ధరణి విరియ పాడుదునా!

## తొలి వేగుచుక్కగా

తొలి వేగు చుక్కగా తులకింపనా—కొలని
తొలి కలువ మొగ్గగా పులకింపనా!

నవ సంధ్య వెలుగు లిక రానున్నవని దెలుపు
నవకాంతు లుదయించి రాణించునని పలుకు
శుభవార్త నే భువిని వినిపింతునా!
శుభనాదమును నేను ప్రోగింపనా!

తొలి వేగుచుక్కగా తులకింపనా!—కొలని
తొలి కలువ మొగ్గగా పులకింపనా!

నవభాను డుదయించు నవ్యతలు వ్యాపించు
సరిక్రొత్త జీవితము సరసత్వములు భువిని
ఉదయించు ననువార్త వినిపింతునా!
ఉత్సాహ దీపికల మెఱపింతునా!

తొలి వేగుచుక్కగా తులకింపనా!—కొలని
తొలి కలువ మొగ్గగా పులకింపనా!

నవ్యప్రపంచ మిక రానున్న సంగతిని
శుభవార్త నీ భువికి సురుచిరంబుగ దెలుపు
ఆశా ముత్యంబునై యలరింపనా!
అమృతవాహిని భువికి నందింపనా!

తొలివేగుచుక్కనై తులకింపనా!—కొలని
తొలికలువ మొగ్గగా పులకింపనా!

## ఊగింతునా జగము

ఊగింతునా! జగము నూగింతునా!
ఉయ్యాలనై జగము నూగింతునా!

ఇంద్రచాపమును నే నింపౌలుకు కొమ్మగా
దిక్కులను, దిశలను దివ్యమగు గొలుసులుగ!
అఖిల విశ్వము జేతు నుయ్యాలగా!
ఆనందమున దేలు నుయ్యాలగా!

ఊగింతునా! జగము నూగింతునా!
ఉయ్యాలనై జగము నూగింతునా!

ఖండాంతరములలో గలుగు ప్రజలందఱిని
మధుర గీతముబాడి మనసు రంజింపుచును!
స్నేహ మాధుర్యముల పులకింపనా!
చిరకాల బంధముల బిగియింపనా!

ఊగింతునా! జగము నూగింతునా!
ఉయ్యాలనై జగము నూగింతునా!

జాతిభేదము మఱచి జగతి ప్రజ యొక్కటయి
శాంతిగీతములతో కాంతినాదములతో
కాలకాల మీ ధరణి నూగింతునా!
కమనీయ జీవితము వెలయింతునా!

ఊగింతునా! జగము నూగింతునా!
ఉయ్యాలనై జగము నూగింతునా!

## కాపు కన్నె

కాపు కన్నెగ నేను కలకలా నవ్వుచూ
పంట చేలను తిరిగి పరువు లెత్తుదునా!

చేలగట్టులపైని చెంగు చెంగున యెగిరి
అదిరించి దూడలను, బెదిరించి పక్షులను
ఈలపాటలు పాడి యలరింపనా!
గాలిపాటలు పాడి తేలింపనా!

కాపుకన్నెగ నేను కలకలా నవ్వుతూ
పంటచేలను తిరిగి పరువు లెత్తుదునా!

మంచెపై నే నెక్కి మధుర దృశ్యాలను
వింత వింతల ప్రకృతి వినువీధి చిత్రాలు
కంటికింపుగ నేను తిలకింతునా!
కమనీయ హర్షమున పులకింపనా!

కాపుకన్నెగ నేను కలకలా నవ్వుచూ
పంటచేలను తిరిగి పరువు లెత్తుదునా!

కోకిలల పాటలను, గోరింక పలుకులను
చిలుక గుంపులుచేయు చిత్రమగు నల్లరులు
పాటగా నేపాడి పలవింతునా!
పంటచే నంతయును ధ్వనియింపనా!

కాపుకన్నెగ నేను కలకలా నవ్వుచూ
పంటచేలను తిరిగి పరువు లెత్తుదునా!

# బాల సూర్యుని

బాలసూర్యుని లేత బంగారు కిరణామై
మబ్బు కన్నెల దేల మనసులో కాంక్షా!

తెలిమబ్బు చాటునను తేలి నే పయనించి
నా కాంతి కిరణమున నవ్యత్వమును గూర్చి
చిత్ర చిత్రములైన చిత్రములు లిఖియింతు!

బాలసూర్యుని లేత బంగారు కిరణామై
మబ్బు కన్నెల దేల మనసులో కాంక్షా!

రంగురంగుల తోణుకు రమణీయ చిత్రములు
ఆకాశ మంతటను నలరింతు సొగసులను!
బంగారు గొలుసులను బంధింతు నొకటొకటి!

బాలసూర్యుని లేత బంగారు కిరణామై
మబ్బు కన్నెల దేల మనసులో కాంక్షా!

బంగారు తీగనై పసుపు పచ్చలు ప్రాణికి
వేల అందాలు నను వెన్నంట చోద్యముగ
మబ్బుచాటుల నుండి మర్మముగ నే జూతు!

బాలసూర్యుని లేత బంగారు కిరణామై
మబ్బు కన్నెల దేల మనసులో కాంక్షా!

# పంట చేనుగ

పంటచేనుగ నేను పరవశింపగ కాంక్ష!
ప్రకృతి అందాలన్ని పరిమళము లొలుకా!

పైరుగాలికి నూగి పరవళ్ళు ద్రొక్కుచు
అటునూగి యిటునూగి యలల కదలికవోలె
అచ్చరల నాట్యముగ నలరుదును భువినీ!

పంటచేనుగ నేను పరవశింపగ కాంక్ష!
ప్రకృతి అందాలన్ని పరిమళము లొలుకా!

పాలూర నూనూగు పసిడి గింజలు తొణికి
సిగ్గు తెరలను నూగు సిరితొలుకు వన్నెలను
తలవంచి మధురిమల వలపు సిగ్గులు బోదు!

పంటచేనుగ నేను పరవశింపగ కాంక్ష!
ప్రకృతి అందాలన్ని పరిమళము లొలుకా!

కడుపార సిరుల నే కని పెంచి జీవులకు
నర్పించి, యాశలను హరియించి, భజియించి
అఖిలేశ్వరుని జేర అది నాకు తుదికాంక్ష!

పంటచేనుగ నేను పరవశింపగ కాంక్ష!
ప్రకృతి యందాలన్ని పరిమళము లొలుకా!

# వాసంత ఋతువు

వాసంత ఋతువునై వన్నెలొలుకుదునా!
చిగురు పూవులతోడ చిన్నె లొలుకుదునా!

పచ్చనీ చిగురులను బంగారు పూవులను
వనవీధి యంతయును వయ్యారములు చింద!
పుష్పాదులు చిందగా పూసోన ప్రవహింప!

వాసంత ఋతువునై వన్నెలొలుకుదునా!
చిగురు పూవులతోడ చిన్నెలొలుకుదునా!

మావి కొమ్మలమధ్య మధుర నాదములతో
కుహూ కుహూ ధ్వానులతో కోకిలల పాటతో
చిలుక, గోర్వంకలా చెలువొందు పలుకులను!

వాసంత ఋతువునై వన్నె లొలుకుదునా!
చిగురు పూవులతోడ చిన్నెలొలుకుదునా!

మలయ మారుత వీచి మాధురులు పులకింప
అడుగడుగు అందాలు అలరింప ప్రకృతిని
కవి కుమారులు నూత్న కావ్యములు రచియింప!

వాసంత ఋతువునై వన్నెలొలుకుదునా?
చిగురు పూవులతోడ చిన్నెలొలుకుదునా!

## లే యావు దూడగా

లేయావు దూడగా లీల మెఱయుదునా!
చెంగు చెంగున యెగిరి చిందులాడుదునా!

తల్లి పొదుగును జేరి తనివార ప్రేమతో
కడుపునిండుగ పాలు, కమ్మగా ద్రావుచును
మాతృప్రేమను బొంది మాధురుల జిందుదును!

లేయావు దూడగా లీల మెఱయుదునా!
చెంగు చెంగున యెగిరి చిందులాడుదునా!

పచ్చని చేలపై పరుగు లురుకులు దీసి
లేత పచ్చికల గడు లీలగా గొఱుకుచును
సింగార మొలికించు చిత్రముగ నే నౌదు!

లేయావు దూడగా లీల మెఱయుదునా!
చెంగు చెంగున యెగిరి చిందులాడుదునా!

నేనుండు తావులే నిఖిల సుఖ సౌఖ్యములు
నే నడుగు బెట్టగా నిర్మలంబగు శాంతి!
నవధాన్యములు పండు నవరత్నములు నిండు!

లేయావు దూడగా లీల మెఱయుదునా!
చెంగు చెంగున యెగిరి చిందులాడుదునా!

# భూప్రజల వేదనలు

భూప్రజల వేదనలు, పుడమి బాధలుజూచి
అశ్రువులు తొణికినవి ఆర్ద్రితలు తొలుకా!

దాసత్వమును జూచి, దారిద్ర్యమును గాంచి
వేదనలు, రోదనలు వెతలనన్నీ తెలిసి
కన్నీటి భాష్పములు కదలాడె కనులలో !

భూప్రజల వేదనలు, పుడమి బాధలుజూచి
అశ్రువులు తొణికినవి యార్ద్రితలు తొలుకా!

పొగలందు మరలందు వగజెందు కార్మికులు
భూమాత బిడ్డలిల పొందు వెతలనుజూచి
కలత జెందిన మనసు కన్నీరు తొణికినది!

భూప్రజల వేదనలు పుడమి బాధలు జూచి
అశ్రువులు తొణికినవి యార్ద్రితలు తొలుకా!

దిక్కుదెస లేని ప్రజ దీనత్వమును జూచి
పతితులైనా ప్రజల భ్రష్టత్వమును గాంచి
కన్నీరు రక్తమై కాల్వగా పాఱినది!

భూప్రజల వేదనలు పుడమి బాధలుజూచి
అశ్రువులు తొణికినవి యార్ద్రితలు తొలుకా!

## అణువుగా

అఖిల విశ్వములోని యలరు జీవులతో
అణువుగా నే మారి యైక్యమై పోదునా!

నింగి నీలాలపై సీటుగా యెగిరేటి
పక్షిలో పక్షినై పరవశించుదునా!

అఖిల విశ్వములోని యలరు జీవులతో
అణువుగా నే మారి యైక్యమై పోదునా!

అలలలో తెరలలో నఖిల జలములలోని
జలచరములను జేరి తేలిపోవుదునా!

అఖిల విశ్వములోని యలరు జీవులతో
అణువుగా నే మారి యైక్యమై పోదునా!

పుడమి యంచులవఱకు పొలుపొందు జీవులను
మనసులో మనసునై మమత చిందుదునా!

అఖిల విశ్వములోని యలరు జీవులతో
అణువుగా నే మారి యైక్యమై పోదునా!

స్వార్థ వైషమ్యములు సకలమును నే విడిచి
ఆత్మలో ఆత్మనై యైక్యమై పోదునా!

అఖిల విశ్వములోని యలరు జీవులతో
అణువుగా నే మారి యైక్యమై పోదునా!

# ప్రక్క మనిషి

ప్రక్కమనిషిని జూతు పసిడి చూపులతో
నిక్కమగు స్నేహమును నిలిపి హృదయమునా!

మధురముగ మాటాడి మనసు తీపిగజేతు
ఊయాల జంపాల నూగింతు ప్రేమలను!
భాతృభావము చిలికి పరవశము గావింతు!

ప్రక్కమనిషిని జూతు పసిడి చూపులతో
నిక్కమగు స్నేహమును నిలిపి హృదయమునా!

జాతి కుల భేదముల స్వార్థ దుశ్చింతలను
అడ్డుగోడల గూల్చి యార్ద్రతను వెలయింతు!
ప్రీతి వారధి గట్టి ప్రేమలను నొలికింతు!

ప్రక్కమనిషిని జూతు పసిడి చూపులతో
నిక్కమగు స్నేహమును నిలిపి హృదయమునా!

కలిసి జీవించేటి కల మార్గముల నడిచి
అన్నదమ్ములవోలె నందాలు చిలికించి
మనసు లొక్కటిగాగ మమతతో మెలిగెదను!

ప్రక్కమషిని జూతు పసిడి చూపులతో
నిక్కమగు స్నేహమును నిలిపి హృదయమునా!

## తుమ్మి పూవు

తుమ్మి పూవుగ విరిసి తొలుకుతూ నిగనిగలు
భూమాత సొబగులను పూరింపనా!

చిన్ని పాపకువోలె చిఱునవ్వు లొలుకుతూ
ఆకుపచ్చని చీరె నలరు ముత్తెముల వలె
పుడమితల్లికి గూర్తు పుట్టె డుందాలనూ!

తుమ్మి పూవుగ విరిసి తొలుకుతూ నిగనిగలు
భూమాత సొబగులను పూరింపనా!

పార్వతీ వల్లభుని పరమేశు నర్చింప
ప్రతినబూనితి నెపుడో! భజియింప! రమియింప!
సుకుమార ముగ్ధతను సోలుదును! తూలుదును!

తుమ్మి పూవుగ విరిసి తొలుకుతూ నిగనిగలు
భూమాత సొబగులను పూరింపనా!

తుమ్మెదలు నను జేరి తూలి నాట్యములాడ
మందపవనుడు కూర్మి మధుర వీవన లీయ
ఆత్మలో నాత్మనై అందుకుందును ముక్తి!

తుమ్మి పూవుగ విరిసి తొలుకుతూ నిగనిగలు
భూమాత సొబగులను పూరింపనా!

# నల్లని నా నీడ

నల్లనీ నానీడ నలుపు తెలుపగునా?
తియ్యనగునా నాదు తీపి కలలన్నీ?

నామనో భావముల నల్లని నీడలే
నా నీడగా మారి నను వెంబడించే!
తెల్లనీ మల్లెగా తేలునా నా మనసు?

నల్లనీ నానీడ నలుపు తెలుపగునా?
తియ్యనగునా నాదు తీపి కలలన్నీ?

విషవృక్షమునకు వలె వ్రేళ్ళూని వ్యాపించి
అంధ తమసులు నన్ను అలుముకొనె హృదినంత!
పున్నమీ వెలుగులా పొలుపొంది తెలుపగున?

నల్లనీ నానీడ నలుపు తెలుపగునా?
తియ్యనగునా నాదు తీపి కలలన్నీ?

కొలనిలో తామరగ కోటిరేకలు విరిసి
స్వచ్ఛమగు సుందరత సౌందర్య మొలుకుచు
అఖిల విశ్వమునకూ ఆనంద మొసగుదున?

నల్లనీ నానీడ నలుపు తెలుపగునా?
తియ్యనగునా నాదు తీపి కలలన్నీ?

# ఆ చివరి క్షణములో

ఆ చివరి క్షణములో ఆ మధుర గీతమును
ఆలపించాలనీ! అదె! నాదు కాంక్షా!

సెలయేటి నవ్వడిని శిలలోని శిల్పమును
సంధ్య వెలుగుల కదులు చక్కనగు మబ్బులను
పాడుచూ పాడుచూ పయనింప నాకోర్కె!

ఆ చివరి క్షణములో ఆ మధుర గీతమును
ఆలపించాలనీ అదె! నాదు కాంక్షా!

చక్కనీ చుక్కలను చందమామను జూచి
మురళీ ధ్వనులు వినుచు మోదమున గొంతెత్తి
ఆత్మార్పణం బనుచు ఆ గీతి బాడుదును!

ఆ చివరి క్షణములో ఆ మధుర గీతమును
ఆలపించాలనీ అదె! నాదు కాంక్షా!

సకల జీవులకెల్ల శాంతి దయసేయుమని
ఆ దివ్యపురుషునికి యంజలిని ఘటియించి
మబ్బులా నింగిలో మాసిపో నా కోర్కె!

ఆ చివరి క్షణములో ఆ మధుర గీతమును
ఆలపించాలనీ అదె! నాదు కాంక్షా!

# పసిడిమీగడ చూపు

పసిడి మీగడచూపు పాలవెన్నెల నవ్వు
అందాల బాలనై యలరియుంటేనూ!

అల్లిబిల్లిగ తిరిగి ఆటపాటల యందు
పరికిణీ కుచ్చెలులు పాదముల తొలుకాడ
అందఱికి ముద్దునై యలరి కులికేనూ!

పసిడి మీగడచూపు పాలవెన్నెల నవ్వు
అందాల బాలనై యలరి యుంటేనూ!

సంక్రాంతి పండుగను చక్కనీ దుస్తులను
బొమ్మ కొలువులు దీర్చి అమ్మలందఱి చేత
దీవనల నందుదును దివ్యతేజము లంద!

పసిడి మీగడచూపు పాలవెన్నెల నవ్వు
అందాల బాలనై యలరి యుంటేనూ!

తోడి బాలకలతో తోరంపు గీతముల
ఉయ్యాల జంపాల నూగుచును స్నేహమున
చిన్నారి చిలుకనై చిత్రముగ కనిపింతు!

పసిడి మీగడచూపు పాలవెన్నెల నవ్వు
అందాల బాలనై యలరి యుంటేనూ!

## ఆ ప్రీతి బంధము

ఆ ప్రీతి బంధమే యలరి యుంటే నన్ను
ఆనంద ధామమున యలరి తేలేను!

ఆకాశ వీధిలో హరివిల్లు విరియునటు
భూమి యాకాశములు పొలుపు గులికిన యటుల
ఆత్మవిభు చరణముల నైక్యమై యుందూ!

ఆ ప్రీతి బంధమే యలరి యుంటే నన్ను
ఆనంద ధామమున యలరి తేలేను!

పూవు తీగెకు మధ్య పాలుపొందు బంధమటు
ఆట పాటకు మధ్య నలరు సంబంధముగ
నా స్వామి హృదినుందు నవపుష్ప దామమై!

ఆ ప్రీతి బంధమే యలరి యుంటే నన్ను!
ఆనంద ధామమున యలరి తేలేనూ!

దీప కాంతులకుగల దివ్య సంబంధ మటు
ఆత్మ పరమాత్మలకు అలరు పెనుబంధముగ
నా కాంతు చెంత నే నర్తనలు గావింతు!

ఆ ప్రీతిబంధమే యలరి యుంటే నన్ను!
ఆనంద ధామమున యలరి తేలేనూ!

# నవసంధ్య రేఖలు

నవసంధ్య రేఖలకు నా దివ్య స్వాగతము!
నవ ప్రభాతమున కిదె నాదు పూమాలా!

కొ్రత్త లోకమునకూ క్రొంగ్రొత్త వెలుగులకు
క్రొత్త జీవితమునకు కోటి తోరణములకు
నవ్య మానవున కిదె నవ భావముల కిదే!

నవసంధ్య రేఖలకు నా దివ్య స్వాగతము!
నవ ప్రభాతమున కిదె నాదు పూమాలా!

అన్న వస్త్రంబులకు నలమటించుట లేక
అఖిల జనులందఱును ఆత్మీయులై మెలగు
సరిక్రొత్త సంఘ మిల విరియ స్నేహములతో!

నవసంధ్య రేఖలకు నా దివ్య స్వాగతము!
నవ ప్రభాతమున కిదె నాదు పూమాలా!

వర్గ భేదములేని వర్ణ భేదములేని
ఖండాంతరములందు కలజనులు ఒక్కటై
శాంతి కేతన మెత్తి కాంతి వెలుగులు చిందు!

నవసంధ్య రేఖలకు నా దివ్య స్వాగతము!
నవ ప్రభాతమున కిదె నాదు పూమాలా!

## సింధూర రేఖ

చిమ్మ చీకటియందు సింధూర రేఖనై
బాటసారికి వెలుగు బాట జూపుదునా!

కనుచూపు మేరలో కాంతి రేఖలు లేక
విలపించు మానవుని వేదనలు తొలగింప
అరుణ రేఖలు విరిసి యానంద మొందింతు!

చిమ్మ చీకటియందు సింధూర రేఖనై
బాటసారికి వెలుగు బాట జూపుదునా!

అలలలో తెరలలో ఆపదల విలపించు
సుడిగుండముల మునుగు కడుదీన మానవుని
దరిజేరి వెతదీర్చి దరికి జేర్చుదునా!

చిమ్మ చీకటియందు సింధూర రేఖనై
బాటసారికి వెలుగుబాట జూపుదునా!

కంటినీటిని తుడిచి కడగండ్ల తొలగించి
కాంతి శాంతిని గూర్చి కమనీయ స్నేహమున
పయనించు పథికునకు పాట నే నగుదునా?

చిమ్మ చీకటియందు సింధూర రేఖనై
బాటసారికి వెలుగు బాట జూపుదునా!

# పూ మొక్కనై

పూ మొక్కనై పుడమి పుట్టి పెరుగుదునా!
భూమాత నందాల పులకరింపుదునా!

చిన్నారి మొక్కనై తీగెగా నల్లుకొని
అల్లి బిల్లిగ కొమ్మ నందుకొని పుష్పించి
పుడమితల్లిని పూల వర్షింతునా!
పుట్టెడందాలనూ జేకూర్తునా!

పూ మొక్కనై పుడమి పుట్టి పెరుగుదునా!
భూమాత నందాల పులకరింపుదునా!

కమ్మనీ వాసనల కలకలా నవ్వుచూ
పుష్పాదుల రాల్చుచూ పూసోన లొలుకుచూ
కన్నతల్లికి పూజ లర్పింపనా!
కమనీయ యర్చనల పులకింపనా!

పూ మొక్కనై పుడమి పుట్టి పెరుగుదునా!
భూమాత నందాల పులకరింపుదునా!

దైవ పూజకు దేశభక్తునికి మాలనై
నా హృదయ కుసుమముల నా భక్తి కనబఱచి
మాతృ ఋణమును బాసి వర్తింతునా!
మర్యాదలను బొంది నర్తింతునా!

పూ మొక్కనై పుడమిపుట్టి పెరుదునా!
భూమాత నందాల పులకింపుదునా!

# శరదంబుదము వోలె

శరదంబుదము వోలె సకల దిక్కులయందు
శాంతి సందేశమును కాంతి నొలుకుదునా!

కారుమబ్బులు తొలగి కటిక చీకటి విడిచి
ప్రళయ భీకర వర్ష పాతములు మానెనని
తెల్లనీ అందాలు చూపింపనా!
తేలుచూ తూలుచూ పులకింపనా!

శరదంబుదము వోలె సకల దిక్కుల యందు
శాంతి సందేశమును కాంతి నొలుకుదునా!

బెగ్గురుల గుంపుతో ప్రియ కపోతములతో
ఆకాశ మార్గాన యంతటా విహారించి
మనుజులకు మంగళంబని పాడనా!
మధుర గీతముల నే వినిపింపనా!

శరదంబుదము వోలె సకల దిక్కులయందు
శాంతి సందేశమును కాంతి నొలుకుదునా!

తెల్లనీ వెన్నెలల తేలుతూ గగనమున
చలువ పందిరులతో సరసత్వ మొలికించి
అచ్చెరల యందాలు చూపింపనా
స్వచ్ఛమగు ముత్యాలు కురిపింపనా!

# ఆ తపోవనములో

ఆ తపోవనములో ఆ దివ్య భూమిలో
ఆనంద ధామమున నలర నా కాంక్షా!

ద్వేష విద్వేషములు దీనత్వములు లేని
అంధ విశ్వాసములు అలసత్వమును లేని
మానవత్వము తొలుకు మధుర భావము లొలుకు!

ఆ తపోవనములో ఆ దివ్యభూమిలో
ఆనంద ధామమున నలర నా కాంక్షా!

సర్వ జీవుల యెడను సాధుభావము గలిగి
ప్రేమ మధురామృతము ప్రీతి వెదజల్లుచును
ఆత్మీయ భావముల అందాలు చిందేటి

ఆ తపోవనములో ఆ దివ్యభూమిలో
ఆనంద ధామమున నలర నాకాంక్షా!

అజ్ఞానమును వీడి అంధతమసము బాసి
విజ్ఞాన కమలములు వికసించు హృదయములు
ఆ పరంజ్యోతిలో ఐక్యమగు జను లుండు!

ఆ తపోవనములో ఆ దివ్యభూమిలో
ఆనంద ధామమున నలర నాకాంక్షా!

# నా ప్రయాణము

నా ప్రయాణము నెటుల నలుగురికి వినిపింతు?
దారి తెన్నూ లేని దరిదాపు లేనిదీ!

శూన్యత్వమును బాసి చుక్కలన్నీ దాటి
చంద మామను దాటి జగము లన్నీ గడిచి
విను వీధిలో నేను వేగ పయనించాలి!

నా ప్రయాణము నెటుల నలుగురికి వినిపింతు?
దారి తెన్నూ లేని దరిదాపు లేనిదీ!

కొండ కోనల వెనుక కోటివనముల చివఱ
భూమి యాకాశములు పొలుపు గులికిన చోటు
ఉదయ సంధ్యలు విరిసియున్న యా చోటునకు!

నా ప్రయాణము నెటుల నలుగురికి వినిపింతు?
దారి తెన్నూ లేని దరిదాపు లేనిదీ!

స్వర్ణ కమలము విరియు సరసునకు జేరాలి!
దివ్య జ్యోతులు వెలుగు దేవళము జేరాలి!
అఖిలేశ్వరునియందు ఐక్యమై పోవాలి!

నా ప్రయాణము నెటుల నలుగురికి వినిపింతు?
దారి తెన్నూ లేని దారిదాపు లేనిదీ!

## కల గంటి! కల గంటి!

కలగంటి కలగంటి కమ్మనీ కలగంటి!
నవజీవనము పుడమి నాట్యమాడుట గంటి!

ఆకలీ దారిద్ర్య మంతరించుట గంటి!
వేదనలు దుఃఖములు వేఱుబడుటను గంటి!
మమత మాధుర్యములు మానవులలో గంటి!

కలగంటి కలగంటి కమ్మనీ కలగంటి!
నవజీవనము పుడమి నాట్యమాడుట గంటి!

సమ సమాజమునందు సకల మానవులంత
ఆట పాటల యందు నలరు చుండుట గంటి!
పుడమంత బంగారు పువ్వులే పఱచినటు!

కలగంటి కలగంటి కమ్మనీ కలగంటి
నవ జీవనము పుడమి నాట్యమాడుట గంటి!

శ్రమశక్తి దోపిడిక చెల్లదను శాసనము
సకల సంపదలింక సర్వ జనులందవి!
సమ సమాజము ధరణి సర్వత్ర వెలయుటను

కలగంటి కలగంటి కమ్మనీ కలగంటి
నవ జీవనము పుడమి నాట్యమాడుట గంటి!



# ఇతర గ్రంథములు

ఈ దిగువ పుస్తకము లన్నియు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ గ్రంథాలయ సంస్థ వారిచే ఆమోదింప బడినవి.

| | | | |
|---|---|---|---|
| 1. | నాలో వెలిగే దీపాలు [బాల సాహిత్యం] | 0 | 50 |
| 2 | విజయ మంగళమ్ [గేయములు] | 4 | 00 |
| 3. | ఆనంద మంగళమ్ [గేయములు] | 4 | 00 |
| 4. | ఉత్తర గోగ్రహణమ్ [నాటిక] | 2 | 00 |
| 5. | నాట్యశాల [నాటిక] | 4 | 00 |
| 6. | భారతకోకిల సరోజినీదేవి – నవయుగ నిర్మాత [illegible] కస్తూర్బా[illegible] [బుర్రకథలు] | 2 | 00 |
| 7 | అందరికీ [illegible] [నాటిక] | 2 | 00 |
| 8. | భూమితల్లి బిడ్డలు [నాటిక] | 2 | 50 |
| 9 | గోపబాలిక [illegible] | 1 | 50 |
| 10. | వినయాంజలి | 4 | 00 |
| 11 | పాలేటి తరగలో [illegible] [పాటలు] | 5 | 00 |
| 12 | వీధి దీపం [వచన గేయ కవితా సంపుటి] | 4 | 00 |
| 13 | శ్రీ రామచంద్ర సుధ [పాటలు] | 4 | 00 |
| 14 | వీరనారీమణి ఝాన్సీ లక్ష్మీబాయి [బుర్రకథ] | 2 | 50 |
| 15 | కృష్ణదాసి [గేయములు] | 4 | 00 |
| 16. | పూలరథం [ప్రబోధ గీతాలు] | 4 | 00 |

నూతన ప్రచురణలు

| | | | |
|---|---|---|---|
| 1. | హరిదాసి [పావై పాటలు] | 2 | 00 |
| 2. | శోణపద్మం [సాంఘిక నాటిక] | 3 | 00 |
| 3. | శ్రీ అల్లూరి శీతారామరాజు (బుర్రకథ) | 3 | 00 |
| 4 | చిగురులు–పువ్వులు [భావ గీతాలు] | 4 | 00 |

ప్రతులకు :

**పి. దుర్గారావు,** యం. ఓ యల్.

చెఱుకుపల్లి, [పోస్టు] [వయా] నక్రేకల్, నల్లగొండజిల్లా.